Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.]  మద్రాసు : 1941 వ సం॥ జూలై నెల 11 వ తేది శుక్రవారం  [నె 17 రు

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### విమానదాడులు.

బ్రిటిషు విమానములు జూలై 2 వ తేది రాత్రి జర్మను పారిశ్రామిక నిలయములగు బ్రెమెన్, కొలోన్, డ్యూయిస్‌బర్గు పట్టణములపై వేలకొలది బాంబులు వర్షించెను. ఈ దాడినుండి నాల్గు విమానములు తిరిగి రాలేదు. హెర్బర్గు రేవునందలి గిడ్డంగులును, రాటర్డాం పట్టణమునందలి నూనె యంత్రాలయములును శిథిలమునర్పబడెను. ఇంగ్లీషు ఛానలునందు 6,000 టన్నుల శత్రుల సప్లై నౌకయొకటి బ్రిటిషు విమానములచే ముంచివేయబడెను. ఫ్రాన్సుపై నాడు జరిగిన విమాన పోరాటమున 18 శత్రు విమానాలు పడగొట్టబడెను. 4, 5 తేదిలలో పగలు వందలకొలది బ్రిటిషు విమానములు ఫ్రాన్సు ఉత్తరప్రాంతపు పట్నములపైకి దాడి సాగించెను కాని శత్రువిమానములు ప్రతిఘటించుటకు పైకి రాలేదు. 3 వ తేది రాత్రి దాడులవలన జర్మనీ వాయవ్య భాగమున ఆస్తికి చాల నష్టము గల్గినదని జర్మను అధికారులే అంగీకరించిరి. ఎస్సెను నగరమునందుగల క్రెప్పు ఆయుధ నిర్మాణశాలలపై వందలకొలది బాంబులు వర్షింపబడెను. 7 బ్రిటిషు విమానములు తిరిగి రాలేదు. 16 శత్రు విమానములు ధ్వంస మొనర్పబడెను. 5 వ తేదిన జర్మనీ, ఫ్రాన్సు, నార్వే ప్రాంతములమీద బ్రహ్మాండమగు విమాన దాడులు జరుపబడెను. ఈ దాడులలో 21 శత్రు విమానములు ధ్వంస మొనర్పబడెను. నాల్గు బ్రిటిషు విమానములు తిరిగి రాలేదు. బ్రెస్టు రేవునందు విశ్రమించియున్న గ్నీసూ, షారన్‌హారిస్టు, యూజిన్ అను జర్మను యుద్ధ నౌకలమీదను లోరియంటు రేవునందలి శత్రు జలాంతర్గాముల మీదను చాల బాంబులు వేయబడెను. 7 వ తేదిన పగలును, రాత్రియునుగూడ వందలకొలది బ్రిటిషు విమానములు జర్మనీపైనను, ఫ్రాన్సుపైనను చాల పెద్దదాడుల సాగించెను. పగటి దాడిలో బర్లినుకు 100 మైళ్ళ దూరమునగల మాగ్డిబర్గు వరకునుగూడ చొచ్చుకొని వెళ్లెను. మన్‌స్టరు, మాగ్డిబర్గు, బీలిఫెల్డు పట్టణములలోని కర్మాగారములన్నియు బ్రిటిషు బాంబులచే ధ్వంసమయ్యెను. ఉత్తర సముద్రమునందు నాల్గు జర్మను సప్లై నౌకలు ముంచివేయబడెను.

8 వ తేదీ మంగళవారమునాడు ఫ్రాన్సు ఉత్తర భాగములోని పారిశ్రామిక పట్నముగు "లిల్లీ"పై భయంకరమగు దాడి జరుపబడెను. అచట జరిగిన విమాన యుద్ధములో 9 శత్రు విమానములు కూల్చివేయబడెను. 7 బ్రిటిషు విమానములు నష్టమైనవి. జర్మనీలోని విల్‌హెల్మ్సుహావన్ మొదలగు జర్మను నౌకానిలయములపైనను ల్యూనా మొదలగు పారిశ్రామిక పట్టణములపైననుగూడ దాడులు జరిపి అపారమగు నష్టమును గల్గించెను.

జూలై 2 వ తేది బుధవారమునాడు పగలును రాత్రియును గూడ బ్రిటనుపై నెక్కడను శత్రువిమానదాడులే లేవు. మరునాడు గురువారమునాడు, సముద్రతీర ప్రాంతమున ఒకటి రెండు పట్నములలో, స్వల్పముగ మాత్రము బాంబులు పడెను. 4 వ తేది రాత్రి మాత్రము, బ్రిటిషు పశ్చిమతీరమున మెర్సెసైడు ప్రాంతముపై చిన్నదాడులు జరిగెను. ఆరాత్రి 6 శత్రువిమానములు పడగొట్టబడెను. 5 వ తేదిన మిడ్లండ్సు ప్రాంతముమీదను, వేల్సు దక్షిణ భాగముమీదను, ఇంగ్లండు పడమటి ప్రాంతముననుచిన్న శత్రు విమానదాడులు జరిగెను ప్రజలలో కొందరు హతులైరి. కాని నష్టమెక్కువ జరుగలేదు. ఒక శత్రువిమానము పడగొట్టబడెను.

జూన్ నెలయందు శత్రుప్రాంతములపై దాడులలో 160 విమానములు నష్టమయ్యెను. 183 జర్మను విమానములు ధ్వంసమొనర్చబడెను. బ్రిటనుపై దాడులలో 52 శత్రు విమానములు కూల్చబడెను. 2 బ్రిటిషు విమానములు నష్టమయ్యెను.

బ్రిటను దక్షిణతీరపు రేవుపట్టణమగు సౌథాంప్టన్‌పైన జర్మను విమానములు సోమవారమునాడు కొంచెంసేపు తీవ్రమగు దాడి సాగించినవి. కొన్ని భవనములు శిథిలమయ్యెను. ఈ దాడిలో రెండు శత్రు విమానములు పడగొట్టబడెను. మంగళవారమునాడు మిడ్లండ్సు ప్రాంతముపై ఒక మాదిరి తీవ్రమగు దాడియే జరుపబడెను. ఆ దాడిలో 5 శత్రు విమానములు పడగొట్టబడెను.

### ఆఫ్రికా-మధ్యధరా.

ఉత్తర ఆఫ్రికా రంగమున ఈ వారమున యెక్కువ మార్పులు లేవు. లిబియాలో టోబ్రూకు దుర్గమువద్ద గస్తీ తిరుగు దళముల పోరాటములు తప్ప ఎక్కువ తీవ్రమగు ఘర్షణలు జరుగలేదు. బ్రిటిషు విమానములు, ట్రిపోలీ, బెంఘాజీ రేవులపైనను సప్లై రహదారులపైనను ప్రతిదినము తీవ్రమగు విమానదాడులు సాగించుచున్నవి.

అబిసీనియా రంగమున, 'డెబ్రాటేబరు' దుర్గమువద్ద నాల్గు నెలలుగా బ్రిటిషు ముట్టడిని నిరోధించుచున్న ఇటాలియను సేనాని జూలై 3 వ తేదిన లొంగిపోయెను. 'గల్లా సిడెమో' అనుదుర్గమున ప్రతిఘటించుచున్న ఇటాలియను సైన్యముగూడ 4 వ తేదిన లొంగిపోయి, దుర్గమును బ్రిటిషు సైన్యముల స్వాధీనమొనర్చెను. అబిసీనియాయందలి ఇటాలియను సైన్యములన్నిటికిని సర్వసేనాధిపతియగు గజ్జేరా సేనాని తన సైన్యములతో సహా లొంగిపోవుటకు ఏర్పాటులొనర్పవలసినదని బ్రిటిషు సేనానికి రాయబారుల నంపెను. ఇక అస్సాబ్ ప్రాంతమున 600 మంది ఇటాలియను సైన్యము మాత్రము మిగిలి యున్నది. దీనితో, తూర్పు ఆఫ్రికాలో యుద్ధము ముగిసినదని చెప్పవచ్చును. గజ్జేరా సేనాని లొంగిపోవుటవలన అపారమగు మందుగుండు సామగ్రియు, ఆయుధములును పట్టుబడెను. జిమ్మా ప్రాంతమున, జూన్ 21 వ తేదినుండి 15 వేల ఇటాలియను సైనికులు ఖైదిలుగా పట్టుకొనబడిరి. 6 వ తేదిన అబిసీనియాలో నచ్చటచటనున్న మరి అర్గురు ఇటాలియను సేనానులును 12 వేల సైనికులును, ఖైదీలుగా బ్రిటిషు అధికారులకు లొంగిపోయిరి.

మధ్యధరా సముద్రమున మాల్టాదీవి పైనను, సైప్రెస్ దీవిపైనను శత్రులు ఈ వారమున రెండు విమానదాడులు జరిపిరి. కాని నష్టమెక్కువ గలుగలేదు.

## రష్యా.

రష్యా ప్రధానమంత్రియగు స్టాలిన్ జూలై 3 వ తేదిన రేడియో ద్వారా రష్యా ప్రజల కుపన్యసించుచు, జర్మనులు మొదటి రోజులలో ముందుకు చొచ్చుకొని వచ్చినను, రష్యా సైన్యములు సిద్ధమై రంగమును ప్రవేశించిన పిమ్మట జర్మనులను పూర్తిగ నోడింపగలమను సంపూర్ణ విశ్వాసమును ప్రకటించెను. జర్మను లాక్రమించుచున్న ప్రాంతముల ప్రజలు, శత్రులకు ఆహార పదార్థములుగాని ఇతర సౌకర్యములుగాని లభింపకుండ వాటిని నిర్మూలించి ఖాళీ చేయవలెనని హెచ్చరించెను. ఆయుద్బోధమువలన, ప్రతిదినమును లక్షలకొలది పురుషులువచ్చి సైన్యమున చేరుతున్నారు.

రష్యా దక్షిణరంగమున, జర్మనులు రుమేనియనులు కలసి, ప్రూత్ నదిని దాటి నీస్టరువైపునకు సాగిపోవుచున్నవని 3 వ తేదిన జర్మనులు ప్రకటించిరి. కాంస్టాంజా మొదలగు రుమేనియను రేవులను రష్యను విమానములు ధ్వంసమొనర్చుటచే, అచటనుండి క్రిమియా మీదకు దాడివెడలు నుద్దేశమును జర్మనులు వదలుకొనిరి. మిన్స్కు ప్రాంతమునుండి ముందుకు సాగుచున్న జర్మను సైన్యము, రష్యా రాజధానియగు మాస్కో నగరమునకు 300 మైళ్లదూరమున గల స్మాలెన్స్కు పట్టణమును సమీపించినదని జర్మనులు దెలుపుకొనుచున్నారు. దక్షిణమున నల్లసముద్రమునుండి ఉత్తరమున బాల్టికు సముద్రము వరకును రష్యనులిదివరకు నిర్మించుకొని యున్న "స్టాలిను" సైనిక ప్రాకారమును చాల చోట్ల సమీపించినట్లు, జర్మనులు ప్రకటించిరి. ఉత్తర రంగమున జర్మనులు 4 వ తేదిన డ్వినానదిని లట్వియా సరిహద్దులను దాటి 1938 వ సంవత్సరపు రష్యా సరిహద్దులను చొచ్చుకొని పోవుటకు ప్రయత్నించుచుండిరి. ఎస్తోనియా రాజధానియగు టాలిన్ నగరమును 5 వ తేది నాక్రమించుకొని నట్లు జర్మనులు ప్రకటించిరి.

4 వ తేదినుండి జర్మను సైన్యముల పురోగమనము మందగించెను. 5 వ తేదిన బెర్సిను నదిని పలుప్రాంతములలో దాటిరి.

6 వ తేదిన జర్మనులు, దక్షిణమున బుకోవినా రాష్ట్రపు రాజధానియగు సెర్నౌటీ దుర్గమును ఆక్రమించిరి.

ఆక్రమిత ప్రాంతములలో రష్యనులు గోరిల్లా పద్ధతులను అనుసరించి యెదుర్చుచుండుటవలన జర్మనులు అపారమగు నష్టమునకులోనై ముందునకు పోజాలకున్నారు.

7 వ తేదీన తమ సైన్యములు, స్టాలిను దుర్గశ్రేణిని సమీపించినవనియు, మిన్స్కునకు తూర్పు భాగమున, దుర్గశ్రేణిని యెదిర్చి భేదించితిమనియు జర్మనులు 8 వ తేదీన ప్రకటించిరి. కాని 8 వ తేదీన జరిగిన భయంకరమగు పోరాటమున రష్యను సైన్యములు జర్మనుల నోడించి అపారమగు నష్టము గల్గించి వెనుకకు తరిమివేసెనని సోవియటు ప్రకటన దెలుపుచున్నది. మిన్స్కుకు ఉత్తరమునగల లెపెలు ప్రాంతమున జర్మను సైన్యములు రష్యను దాడికి నిలువలేక చెల్లాచెదరై పారిపోయెను. 2 నాజీ మోటారు సైన్యములు పూర్తిగ నిర్మూలింపబడెను.

స్టాలిను సూచనల ప్రకారము, రష్యను సైన్యములు వెనుకకు పోవలసివచ్చినపుడు ఆ ప్రాంతములందలి పట్టణముల నన్నిటిని నిర్మూల మొనర్చి వెళ్లుచున్నారు. జర్మను రుమేనియా సైన్యములు బెస్సరేబియా నాక్రమించెనని జర్మనులు 9 వ తేదీన ప్రకటించిరి. కాని ఆ రోజుననే సోవియటు సైన్యములు, బెసరేబియానుండి, శత్రులను, ప్రూత్ నదిని దాటించి రుమేనియాలోనికి పారద్రోలినట్టుల సోవియటులు ప్రకటించిరి.

బ్రిటను-రష్యాలు కలసి యుద్ధము సాగించుట కవసరమగు యేర్పాటుల నాలోచించుకొనుటకుగాను, సోవియటు యుద్ధశాస్త్ర నిపుణుల రాయబారవర్గమొకటి ఆంగ్లదేశమున కువచ్చెను.

## అమెరికా - అట్లాంటిక్.

పశ్చిమార్ధ గోళమునందలి దేశములన్నియు, ఆత్మరక్షణకు కలసి పనిచేయుటకును, అందుకవసరమగు యేర్పాటుల గావించుటకును, అమెరికా సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము అమెరికా ఖండమునందలి ఇతర రాష్ట్రములకు కొన్ని సూచనలగావించెను. యురుగ్వే ప్రభుత్వ మీ సిద్ధాంతము నంగీకరించి, అమెరికా దేశములలో నేదగాని ఇతర దేశములతో యుద్ధమున దగుల్కొనిన యెడల, ఆ యమెరికా దేశమును స్నేహభావముతో పరికించుచు, మిగిలిన అమెరికా దేశములు తమ నౌకా విమానాశ్రయముల నుపయోగించుకొన నీయవలెనని సూచించెను. దానికి సంయుక్త రాష్ట్రముల ప్రభుత్వము ఆమోదించెను.

సంయుక్త రాష్ట్ర ప్రభుత్వమువారు, 6 వ తేదిన ఐస్లాండునందు తమ నౌకలను సైన్యములను దింపి ఆక్రమణయందుంచుకొనుటకు నిశ్చయించుకొనినట్లు ప్రకటించిరి. అసలీ దీవి డెన్మార్కు ప్రభుత్వమువారిది. గత వత్సరము డెన్మార్కును జర్మను లాక్రమించినప్పటినుండియు, ఈ దీవియందు బ్రిటిషువారు తమ సైన్యములనుంచి తమ స్వాధీనమునందుంచుకొనిరి.

బ్రిటిషు సైన్యములుకూడ ఐస్లాండు నందేయుండుననియు ఉభయ సైన్యములును కలసి ఆ దీవిని రక్షించుననియు చర్చిలు ప్రధాని ప్రకటించెను.

అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రభుత్వము ఐస్లాండు నాక్రమించుటవలన, యుద్ధ ప్రాంతమున ప్రవేశించిరనియు, ఇది ఆక్సిసుపై యుద్ధ చర్యకు ప్రారంభమేననియు జర్మను, ఇటాలియను పత్రికలు వ్రాయుచున్నవి.

ఈ చర్యవలన అమెరికాకు జర్మనీకి త్వరలోనే పోరాటము సంభవించుననియు, అది దూరప్రాచ్యమునకుగూడ వ్యాపించుననియు జపాను పత్రికలు హెచ్చరించుచున్నవి.

సంయుక్త రాష్ట్ర యుద్ధాంగశాఖవారు, విమానదళమునకు సంబంధించిన రిజర్వు సైనికులను వెంటనే వచ్చి సైన్యమున చేరుటకు ఉత్తరువుల గావించిరి.

అమెరికా రక్షణప్రయత్నముల సందర్భమున పూర్వార్ధ, పశ్చిమార్ధ గోళముల విచక్షణ పెట్టుకొనదలచుకొనలేదనియు, అమెరికా రక్షణకే ప్రాంతమున నెట్టి చర్య దీసుకొనవలసి వచ్చినను, సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము సిద్ధముగనున్నదనియు రూజ్వెల్టు అధ్యక్షుడు ప్రకటించెను.

## బాల్కనులు—టర్కీ ఇరాక్ ఇరాన్.

ఈ నెల 4 వ తేదిన టర్కీ-జర్మను ఒడంబడికను బలపరచుచు టర్కీ ప్రధాన మంత్రిగారగు డాక్టరు సైడాంగారు టర్కీ శాసన సభయందుపన్యసించుచు. ప్రస్తుత రష్యా-జర్మను సంగ్రామమున తటస్థముగనుండుటయే టర్కీకి శ్రేయస్కరమని పల్కిరి. కొంతచర్చ జరిగిన పిమ్మట ప్రధాన మంత్రియందు సంపూర్ణమగు విశ్వాసమును ప్రకటించు తీర్మానమత్యధిక సంఖ్యాకులచే ఆమోదింపబడెను.

తమ సరిహద్దులయందు ప్రయాణమొనర్చుచున్న ఫ్రెంచి నౌకపై విమానదాడి సల్పి ముంచివేసినందుకు టర్కీ ప్రభుత్వమువారు బ్రిటిషు ప్రభుత్వచర్యను ఆక్షేపించుచు, ఆ సం

దర్భమున టర్కీయందలి రేవునకు గల్గిన నష్టమునకు పరిహార మొసగవలెనని గోరిరి.

ఈరాక్‌లో రషీదు ఆలీగారి తిరుగుబాటు జరిగినప్పటి నుండియు బాస్రా బాగ్దాదుల మధ్య టపా రైళ్లు ఆగిపోయెను. ఈ వారమునుండియు యథా పూర్వముగ నడచుచున్నవి. దీనినిబట్టి ఈరాక్‌లో శాంతి పరిస్థితులు పూర్తిగ నెలకొనెనని స్పష్టపడెను.

రషీదు ఆలీగారి తిరుగబాటును ప్రోత్సహించిన నల్గురు సేనానులలో నొకరగు కెమాల్ సాహెబు, ఈరాన్ నందుండి తనను క్షమింపవలసినదని గోరుచు ఈరాక్ ప్రభుత్వమునకు దరఖాస్తు పెట్టుకొనెను.

ఈరాక్ రక్షణమును మధ్యప్రాచ్యమునుండి భారత ప్రభుత్వము యొక్కయు భారత సేనానియొక్కయు రక్షణ లోనికి మార్చినయుల చర్చలు ప్రధాని 9 వ తేదిని పార్లమెంటులో ప్రకటించెను.

రష్యాయును బ్రిటనును ఈరాన్ దేశమునకు కొన్ని షరతుల పంపెననియు, బ్రిటను పర్షియా నాక్రమించుటకు కొన్ని సైన్యములను పంపనున్నదనియు, జర్మనులు వ్యాపింప జేయుచున్న వదంతులు పూర్తిగ కల్పితములనియు, మితభేదము గావించుటకుగాను వ్యాపింపజేయుచున్నారనియు, మాస్కో అధికారులు రేడియోలో ప్రకటించిరి.

క్రొత్త రష్యను రాయబారి 4 వ తేదీన ఈరాన్ రాజధానియగు టెహరాన్‌కు వచ్చిచేరెను.

విషీ :

సిరియాకు సైనికుల చేర్చుట కుపయోగింపబడుచున్న ఒక ఫ్రెంచి నౌక, బ్రిటిషు విమానములచే, 5 వ తేదిన టర్కీ తీరపు సముద్రమున ముంచివేయబడెను.

సిరియాలో బ్రిటిషు సైన్యము లీవారము చాల ముఖ్యమగు ప్రదేశముల నాక్రమించుకొన గల్గినవి. పెద్ద విమానాశ్రయమును, ఈరాకు–సిరియా నూనె గొట్టముల మార్గమునకు రక్షణస్థానమును అగు పాల్మైరా పట్టణము 3 వ తేదిని బ్రిటిషు సైన్యములకు లొంగిపోయెను. బైరూతునకు 3 మైళ్ల దక్షిణముగనున్న డామూర్ కోటను 9 వ తేదీన బ్రిటిషు సైన్యము లాక్రమించెను. బ్రిటిషువారికి ఖైదీలుగ చిక్కిన విషీ సైనికులు బ్రిటిషు సైన్యములో చేరి పోరాడుటకు అనుమతి గోరుచుండిరి.

4 వ తేదిన భారత సైన్యములు డియర్ ఎజ్ జార్ కోటను పట్టుకొనినవి.

విషీ ప్రభుత్వముచే పంపబడిన బెనియట్ మెసిన్‌గారు టర్కీ ప్రభుత్వాధ్యక్షుని ప్రధానమంత్రిని కలుసుకొని, టర్కీ గుండా సిరియాకు ఆయుధ సామగ్రిని, సైనికులను పంపుటకు అనుమతిని గోరిరి. కాని టర్కీ ప్రభుత్వము అందుకు అంగీకరింపలేదు.

విషీ ప్రభుత్వ మంత్రివర్గము 5 వ తేదిన సమావేశమై, మెసిక్‌గారు టర్కీలో తమ ప్రయత్నములగురించి సమర్పించిన నివేదికను చర్చించిరి.

సిరియాలోని తమ సైన్యములకు సహాయమునుగాని మందు గుండు సామగ్రినిగాని పంపుటకు వీలులేక పోవుటచే— అనవసరముగ యుద్ధమును సాగించి రక్తపాతము గల్గించుట కిష్టములేక, యుద్ధమును విరమింపవలసినదని, సిరియాలోని ఫ్రెంచి హైకమిషనరగు డెంట్జు సేనానికి ఉత్తరువు చేసితిమని విషీ ప్రభుత్వము ప్రకటించెను. డెంట్జు సేనాని 8 వ తేదిన యుద్ధవిరామమును గోరుచు సిరియాలోని బ్రిటిషు సైనికాధికారులకు రాయబారము లంపెను. బ్రిటిషు అధికారులు ఆరోజుననే తమ షరతుల నందజేసిరి.

## దూర ప్రాచ్యము.

జపాను అధికారులు, ఫిలిప్పైను దీవుల ప్రాంతమునుండి జపాను నౌకలనన్నిటినిగూడ వెంటనే దేశమునకు మగిలి రావలసినదని యుత్తరువుగావించిరి. అమెరికా ప్రాంతముల నుండిగూడ, తమదేశపు నౌకల కిటులనే యుత్తరువు గావించిరి. ప్రభుత్వ కార్యములకు తగినన్ని నౌకలు లేక పోవుటచే ఇదివరకే ప్రభుత్వమువారు చాల నౌకల స్వాధీన పరచుకొనిరనియు ఇపుడు మఱికొన్నిటిని తీసుకొనుచున్నారనియు, దీనికి కారణముగ దెలుపుచున్నారు.

రష్యా-జర్మనీ యుద్ధమున జపాను వైఖరినిగురించి, ఇదివరకే రష్యా వారికి దెలియజేయబడెనని జపాను అధికారులు దెలిపిరి. అమెరికా సంయుక్త రాష్ట్రములు రష్యాకు వ్లాడివాస్టకు మీదుగా సరకుల నంపినయెడల పరిస్థితులు విషమమగుననియు అందుచే జపాను సర్వ సంసిద్ధమై యెదురు చూచుచుండుననియు, జపాను ప్రచురణ శాఖోద్యోగి వెల్లడించెను. రష్యా మంచుకో సరిహద్దులయందు, మంచుకో జపానీయ సైన్యములు సైనిక విన్యాసముల జరుపుచున్నవి.

జర్మనీ వత్తిడివలన జపాను తూర్పు రష్యాపై దాడి సాగించుటయో లేక దక్షిణముగా డచ్చి యిండియా దీవులపైకి జని బ్రిటను అమెరికాలతో సంఘర్షణకు దిగుటయో త్వరలోనే జరుగునని వదంతులు అమెరికాలో వ్యాపించియున్నవి. అమెరికా రష్యాకు సహాయమొనర్చు నెడల దూర ప్రాంత్యమున విషమపరిస్థితులేర్పడుననియు జపానీయులందుకు సిద్ధముగనుండవలెననియు జపాను సైనికాధికారులు హెచ్చరించిరి.

రష్యా-జపాను సంబంధములు యథాపూర్వముగనే యుండును గాని విషమింపవని సోవియటు ప్రచురణ శాఖోద్యోగియగు లోజవిస్కీగారు పల్కిరి.

జపాను, థాయి, ఇండో-చైనా ప్రభుత్వములు గావించుకొనిన ఒడంబడికల ధృవ పత్రములు 5 వ తేదీన పరస్పరము అందజేసుకొనబడెను.

ఈ నెల 7 వ తేదీతో చైనా–జపాను యుద్ధము ప్రారంభమై నాల్గు యేండ్లు ముగిసినవి. ఇంతవరకు జపాను సైనికులు 109,250 మంది హతులైరనియు, చైనీయులు 2,015,000 హతులైరనియు జపాను అధికారులు ప్రకటించిరి.

చైనా ప్రభుత్వ రాజధానియగు ఛంకింగు నగరముపై జపాను విమానములు ప్రతి దినము దాడిసల్పి బాంబులు వర్షించుచున్నవి.

ఫిలిప్పైనుదీవుల (అమెరికావారివి) ప్రభుత్వమువారు ముందు జాగ్రత్త కొరకుగాను, రేడియో సెట్టుల దిగుమతులకు విక్రయముకు కఠినమగు నిబంధనల నేర్పరచిరి. దేశరక్షణ సన్నాహములు జరుగుచున్న లుజాన్ దీవుల ప్రాంతమునకు నౌకల రాకపోకలకు గూడ నిషేధము లేర్పరుపబడెను.

## నౌకా నష్టములు.

8 వ తేదీన జిబ్రాల్టరు ప్రాంతమున జర్మను జలాంతర్గామి యొకటి ముంచివేయబడెను.

అమెరికను వైద్యులను నర్సులను తీసుకొని వచ్చుచున్న ఒక బ్రిటిషు నౌక శత్రులచే ముంచివేయబడెను.

## ఆక్రమిత ప్రాంతములు.

డెన్మార్కు ప్రభుత్వము తమ దేశములోనున్న రాయబారులను కాన్సలేటులను రద్దుచేసి సిబ్బందిని తీసుకు వెళ్లవలె

నదని అమెరికా సంయుక్త రాష్ట్ర ప్రభుత్వమునకు తెలియ జేసెను.

తమ ఆధిపత్యమునకు ప్రతిబంధకమగు ప్రచారము సాగించుచుండిరను నెపముతో, జర్మను అధికారులు, హాలండునందలి చాల జాతీయ సంస్థలను రద్దుచేసిరి. అందు రోమన్ కాథలిక్ సంస్థలుగూడ చాలగలవు.

గ్రీసు రాజును మంత్రివర్గమును దక్షిణ ఆఫ్రికాకు వెళ్ళి చేరిరి.

### తటస్థ రాష్ట్రములు.

ఐర్లండు రేవులందున్న, బాల్టికు రాష్ట్రముల నౌకలు, తమకు రావలెననియు, ఆ రాష్ట్రములు రష్యాలో చేరుట వలన రష్యాయే సదరు నౌకలకు యజమానియనియు సోవియటు అధికారులు తెచ్చిన దావాను, ఐర్లండు న్యాయస్థానమువారు త్రోసివేసిరి.

అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వము ఐర్లండునకు రెండు రెండు నౌకలను పంపుటకు అంగీకరించెనని డివెలరా గారు ప్రకటించిరి.

**ఫ్రెంచి వైమానికులు వారి పోటజ్ బాంబరుతో ఉత్తరువుల నిమిత్తము పడమటి యెడారియందు వేచియుండు దృశ్యము యీ పటములో కానవగును.**



స్వతంత్ర ఫ్రెంచి వైమానికులు లిబ్యాయందలి యుద్ధములో గెల్పొందుచున్నారు. వీరు తమ విమానములతో బ్రిటిషు విమానములకు తోడ్పడుచు బార్డియాపుజోజ్జ దుర్గములపై దాడి జరుపుటలో పాల్గొనిరి.

# రష్యాపై జర్మను దాడి

## జర్మనులే చాల నష్టపోయిరి.

## 7 లక్షల సైన్యం, 1,500 విమానాలు, 2,500 టాంకులు 12 రోజులలో గోల్పోయిరి.

రష్యాలో హిట్లరనుకున్నట్లు జయించలేదని యిపుడు స్పష్టమగుచున్నది. అతి నిడుపైన యుద్ధరంగమునందు పక్షం దినములు యుద్ధం జరిగినను రష్యనులు మొక్కవోవక యుద్ధం చేస్తునే ఉన్నారు. రష్యాకు మొదటినుండి చెందక, నేటి యుద్ధారంభమున 1939 వ సంవత్సరమున వచ్చిచేరిన కొన్ని రాష్ట్రాలలో కొంతభాగం రష్యా ఓడితే ఓడిందిగాక. రష్యా రక్షణకై నిర్మింపబడిన స్టాలిను శిబిర శ్రేణికి చేరువయినకొద్దీ జర్మనులకు చిక్కులెక్కువగుచున్నవి. రష్యనులు చాలచోట్ల తిరుగు దాడులు ప్రారంభించిరి. జర్మనులు మొదటనుకున్నంత త్వరగ జయించే ఆశ వదలుకున్నారని అమెరికను రేడియో ఉద్యోగి ప్రకటించేడు.

నాజీల ప్రకటనలందు గత వారం తెలిపినన్ని ఆశలు యిపుడు ప్రకటింపబడలేదు. అవన్ని అబద్ధాలని యిపుడు రుజువయింది. ఉత్తరాన్న మర్మంస్కు అను రేవును వశపరచుకొంటిమని ప్రకటించిన జర్మను అధికారులే, యిపుడు దానిపై బాంబులువేసితిమని మాత్రం చెప్పి తొలివాక్యం ఖండించుకొనిరి. దక్షిణాన్న రైలుమార్గం చెడగొట్టితిమని వారు చెప్పినమాటగూడ అబద్ధమే. పొలిటికలు కమిస్సర్లు అను తమ యజమానులగు ఉద్యోగులను చంపి వేలకువేలు రష్యను సైనికులు పారిపోయిరని జర్మనులు ప్రకటించియుండిరి. కమిస్సర్లు ఉద్యోగాలను కొన్ని నెలల క్రిందటనే రష్యా ప్రభుత్వంవారు ఎత్తివేసిరి. ఇపుడా పేరుగల ఉద్యోగులే లేరు.

### రష్యా కష్టాలు.

రష్యా అధికారుల పని తేలికని చెప్పుటకు కాదు, యిదంతా చెప్పడం. జర్మనులు ప్రారంభంలో చాల విజయాలు పొందినా రష్యనులు భీతి నొందక నిదానంగానున్నారు. జర్మనులును ఫిన్లండు వారును ఉత్తరాన కరేలియను భూసంధివద్ద విజయం పొందలేకున్నా, హంగేరి రుమేనియా సేనలు గలేసియా, బెసరబియా ప్రాంతములందు జయించినవి. దిన

స్టరు నదిని చాలచోట్ల దాటితిమని హంగేరియనులు ప్రకటించిరి. ఆదివరకు రుమేనియా రాష్ట్రమగు బుకవినాయందొక ముఖ్యపట్నం సిరనాటిని జర్మను లాక్రమించేరు. కాని అందు ఉపయుక్తమగు వస్తువు లన్నింటిని వెడలిపోతున్న రష్యనులు తగులబెట్టిరి. మిన్స్కు నగరానికి తూర్పున ఉన్న జర్మను సైనికదళం రెండుగా చీలి, పటకారు కాడలవలె ఉత్తరంనుండి దక్షిణంనుండి పోయి, ఆ నగరాన్ని చుట్టివేయుటకు యత్నిస్తున్నది. ఉత్తరదళం లెపలు ప్రాంతముల మీదుగ బెరసీనానది దాటిపోవును. దక్షిణదళం బొబ్రుయిస్కు వద్ద నదిదాటును. రెండును సోమ్లెంస్కు నగరంవద్దకలిసి మధ్యను మిన్స్కును నొక్కి యుంచదలచినవి. ఈ రెండుచోట్ల జర్మనుల ఒత్తిడి జాస్తిగా ఉంది. కాని యింతవరకు యంత్రములేని జర్మను దళములే నదులుదాటినవి. సోమ్లెంస్కుపై శత్రువిమానాలు తీవ్రంగా బాంబులు వేసినవి. కాని "నదుల యుద్ధం" యింకా తీవ్రంగా సాగుతునేయున్నది. జర్మనులు మాస్కో నగరానికి చాలదూరంగానే యున్నారు. అందుచే రషియా ప్రచురణ శాఖాధికారిలో జోవిస్కీగారు చెప్పినట్లు, నెపోలియను మాస్కో నగరం చేరనైనా చేరేడుగాని హిట్లరు అనగరంయొక్క ఫోటోతోనే సంతృప్తి పడవలసియుండును.

## జర్మనుదాడి మందగించింది.

జర్మనుదాడి మందగించిందనుటకు సందియంలేదు. దానికి మూడు కారణాలు కలవు. జర్మనీ ఆక్రమించిన భాగంలో రష్యనులు పొంచి ఉండి కొడుతున్నారు. జర్మను టాంకులు తీవ్రంగా పోరాడియున్నవి కావున ఒకసారి శుభ్రపరుచవలసియున్నవి. రషియాలో మార్గములు వెడల్పయిన వగుటచే జర్మనుల బండ్లు ఉపయోగపడకున్నవి. జర్మను సేనలు స్టాలిను శిబిర శ్రేణిని పలుతావులందు చేరినవనియు యికముందు చాల తీవ్రంగా యుద్ధం సాగుననియు, జర్మను అధికారులు ప్రకటించిరి. స్టాలిను శిబిరశ్రేణి ఫ్రాన్సులో మాగినాటులైనంత దిట్టమయినదికాదు, కాని రషియా నేల కనుగుణ్యంగా రక్షణ విధానము ననుసరించి కట్టబడినదని వారే ప్రకటించిరి. ఈ యుద్ధ ప్రారంభంనుండి కట్టుచున్న రక్షణ కట్టడములు వేరుగా మైదానములందున్నవి. రషియా సేనలు వాటిని చేరి విశ్రమించుచుండగా, క్రొత్తసేన లోభాగంనుండి వస్తూవుంటుంది. వచ్చేవారంలో స్టాలిను శిబిరశ్రేణి చేదించడానికి జరిగేయుద్ధం ప్రధానంగా ఉంటుంది.

## రషియనుల తిరుగు దాడులు.

ఈలోగా రషియనులు చాలచోట్ల తిరుగుదాడులు చేస్తున్నారు. తెల్ల రషియాయందు దీనా నదీ తీరాన జరిగిన తీవ్రతరమగు యుద్ధంలో వేలకొలది జర్మనులు చచ్చిపడిరి. వారి శవాలతోను, విరిగిన విమానాలు, టాంకుల భాగములతోను ఆ నదీ తీరాలు నిండిపోయినాయి. మిన్స్కు నగరానికి 120 మైళ్ల దూరాన ఈశాన్య దిక్కున ఉన్న పోలోటుస్కు పురమువద్ద జర్మనులు దీనా నదిని దాటగా, రషియనులు తిరుగుదాడి సలిపి, వారిని వెనుకకు తరమి చావగొట్టిరి. జర్మను సేనలో ఎక్కువభాగం నదీగర్భం చేరెనని రషియా ప్రకటించెను. గత వారంలో రషియా జరిపిన మూడు ముఖ్యమగు తిరుగుదాడులలో యిదియొకటి. ఉత్తరాన లెనిన్‌గ్రాడుపై వస్తున్న జర్మనుసేనలపై ఒక తిరుగుదాడి జరిగెను. దక్షిణాన రెండు జరిగెను. మిగతా రెండుచోట్ల యింకా తీవ్రయుద్ధంసాగుతున్నదని రషియను లంటున్నారు. పారంభంలోవలెనే జర్మనీ ప్రకటనలో యుద్ధవివరాలేమి చెప్పకుండా ఊరుకుంటున్నారు. "స్టాలిను శిబిర శ్రేణిపై అనుకున్న ప్రకారం దాడి సాగిస్తున్నాం" అనిమాత్రం చెపుతున్నారు. రషియావారు చెపుతున్న వివరాలు యిట్లా ఉన్నాయి. (1) ప్స్కోంస్కునుండి లెనిన్‌గ్రాడునకుగల రైలుమార్గంలో ఓస్ట్రొవు స్టేషను చేరువ యుద్ధం జరిగి, జర్మను లాపురమునుండి తరిమివేయబడిరి. వందలకొలది టాంకులను, కాల్బలమును గోల్పోయిరి. (2) బపోలోటుస్కువద్ద జర్మనులు ఓడిన తరువాత, ఈ దీనానదిని రషియనులు కాపాడుతున్నారు. జర్మను దాడి నిలచిపోయింది. (3) బెరిసినా నదిపై మిన్స్కుకు తూర్పున బొరిసావు ప్రాంతములందు రషియనులు తిరుగుదాడి సలుపుటచే తీవ్ర యుద్ధం కొనసాగుతున్నది.

జర్మనులు తమకున్న శక్తినంతా, ప్రతి ఆయుధాన్ని ప్రతి సైనికుని, విమానాలన్నింటిని రషియా యుద్ధంలోదింపి త్వరగా జయించాలని చూస్తున్నారు. రషియను సైన్యాధికారులు గూడ అంతపట్టుదలతోనే యున్నారు. రషియనులు తమ ప్రజలందరిని, ఆయుధసంపత్తి పూర్తిగాగల సైన్యాలన్నింటిని వినియోగిస్తున్నారు. పూర్వంవలె వరుసగా రక్షణశ్రేణులు నిర్మించుకొని కోటలు శిబిరాలు రక్షించుకొనుచుండుట మాత్రం చాలదని రషియనులు గుర్తించిరి. నేటి దాడి లక్షణం ఏమంటే, మోటారు ఫిరంగుల సహాయంతో బలవత్తరమగు సైనిక శ్రేణినిగూడ ముందుచేదించి, వెంటనే వేలకువేలు సైన్యాన్ని క్రుమ్మరించి శిబిరాలను చుట్టవేయుట. దీని నెదుర్కొనుటకు, అత్యంత శక్తిగల సైన్యసమూహమును వెనకాతల వుంచి, శత్రువును లోనికి రానిచ్చిన పిమ్మట తిరుగుదాడి సలిపి, ముందువచ్చిన శత్రుదళమును సంహరించవలెను. కావున చివరకు ఎవరు ఎక్కువ ఫిరంగులు, టాంకులు విమానాలు ఉపయోగించగలుస్తే వారు విజయంపొందుతారు. రషియనులు ఆప్రకారమే చేస్తున్నారు.

"జర్మనులకు ఊపిరాడ నివ్వం" అని లోజొవిస్కీగారు తెలిపిరి. యుద్ధరంగం గీతగీచినట్లుగా తిన్నగాలేక వంకవంకలుగనున్నదనియు, సులభంగా కదలగల సైన్యం పనిచేస్తున్నదనియు, జర్మను సైనికదళం నిలచి కనబడగానే, రషియా దళంపైబడి దానిని అణచివేస్తున్నదనియు వారు చెప్పిరి. 12 దినాలలో జర్మనులలో 7,00,000 మంది చచ్చుటో గాయపడుటో జరిగెననియు, 1,500 జర్మను విమానాలు 2,5[illegible]0 టాంకులు నష్టమయినవనియు, యీ ఉద్యోగి తెలిపెను. ఇదిగాక ఫిన్లండు సముద్రంలో జర్మను జలాంతర్గామి మందుగని తగిలి మునిగెను. రీగా చేరువను రషియా నౌకలు జర్మను యుద్ధ నౌకలను రెంటిని ముంచినవి. ఇపుడు బ్రిటిషు సైనిక రాయబారవర్గంకూడా మాస్కోనగరం చేరినందున రషియా ఇంగ్లాండుల సమిష్టియత్నంవలన జర్మనుల నష్టాలు మరీమరీ ఎక్కువ——

---

# జర్మనీ ఆశలు.

## ఇతర దేశాల కర్తవ్యము.

ఇపుడు జరుగుచున్న యుద్ధాన్ని ప్రపంచయుద్ధంగా మార్చుటకు, జర్మనీ యితర చర్యలన్నిటికన్న రష్యాపై దాడియే ముఖ్యంగా తోడ్పడింది. మెరుపు వేగంతో గెలుస్తేనే హిట్లరు ప్రపంచాధిపత్యం వహించగలడు, లేకుంటే పతనమే. రష్యాపై దాడిచేయాలని కొన్ని నెలల క్రిందటే అతడు నిశ్చయించి యుండియుంటాడు. ఇతరదేశాలను చేసినట్లే, రాజకీయ రాయబారాలు జరిపి రష్యాను గూడ ఏకాకిని చేయుటకు హిట్లరు ప్రయత్నించుచుండెను.

హంగేరి, రుమేనియాలు తనకు వశమయినాక, టర్కీతో ఒడంబడిక గావించుకొని రష్యాపై దాడికి తన కుడివైపు నిరోధంలేకుండా చేసుకొనెను. బాల్కను ద్వీపకల్పమును, ఈజియను సముద్రంలో యూరోపు ఏష్యాల మధ్యనున్న ద్వీపాలన్నీ క్రీటుతో సహా జర్మనీకి వశమగుటవలన రష్యా బలము తగ్గెను. టర్కీపై జర్మనీ పలుకుబడి హెచ్చెను. టర్కీవారు బ్రిటిషువారికి మిత్రులే కాని, యింకముందు వారు స్వతంత్రులు కారు. రష్యాను ఏకాకిగా, చుట్టు మిత్రులు లేకుండా చేయుటేగాక, జర్మనీ ఉత్తరాన ఫిన్లాండును తన చేతిలో నుంచుకొనెను; రష్యాలో ఉక్రైను ప్రాంతాల జాతీయవాదుల తిరుగుబాటును ప్రోత్సహించుచుండెను.

రష్యాపై దాడి వెడలుటకు జర్మనీ ఉద్దేశాలగూర్చి కారణాల గూర్చి అనేకం చెపుతారు. ఉక్రైను గోధుమలు, బాకు చమురు గనులు ఆశించిందను ఆర్థిక కారణాలు అందరికీ తెలిసినవే. యుద్ధం దీర్ఘకాలం కొనసాగుతుందని ఎంచి తన దేశానికి సైన్యానికి ఆహారం చమురు సప్లైలు వృద్ధిచేసుకోడానికి రష్యాను ఆక్రమింపదలచెను.

త్వరలో ఘట్టి దెబ్బతీసి సోవియటు (రష్యా) ప్రభుత్వం కేంద్రస్థానం కుడగొట్టి అరాచకం కలిగించాలని హిట్లరు ఆశిస్తున్నాడు. రషియానుండి ఆర్థికలాభాలను బెదిరించి రాయబారాలుజరిపి సౌమ్య పద్ధతిని సంపాదించలేక పోయాడు. అట్టి పద్ధతి ననుసరింపక, అమానుషమగు ప్రబలమైన సైనిక దాడి వ్యవధియివ్వకుండా ప్రారంభించేడు. ఎందుచేత? ఇంగ్లాండుపై దాడిసలుపుటకు పూర్వం మధ్యధరాసముద్రం మధ్య ప్రాచ్యదేశములనుండి ఇంగ్లీషు సేనలను తరిమివేయు జాలనని హిటరు గుర్తించెను. అంతేకాక ఇంగ్లాండు-అమెరికా సహకారం బలపడి ఎర్ర సముద్రతీరానికి అమెరికా సరకు సప్లైలు దిగుచున్నవనియు, తూర్పున పడమరనుగూడ ఇంగ్లాండు శక్తి సామర్థ్యములు పెంపొందుచున్నవనియు గుర్తించెను. కావున ముందుగ రష్యానుకొట్టి తరువాత బ్రిటిషు సామ్రాజ్యాన్ని ఎదుర్కోవాలని హిట్లరు నిశ్చయించెను. అతనికి 2.5 పూర్తి డివిజనుల (1 డివిజను సుమారు 10,000) సైన్యం, 14 సాయుధ మోటారు డివిజనులు గలవట. వీటితోను విమానదళం సహాయంతోను పడమరను ఇంగ్లాండునుగాని, దక్షిణాన ఇరాను ఇరాకులమీదుగ సూయజు, ఇండియాలనుగాని కొట్టగలడట. రషియ ఓడిపోయినచో అనేకముక్కలుగ చీల్చి, నామ్కేవాస్తే ప్రభుత్వాలను వాటిలో పెట్టి, బానిసకూలీల సేవతో, రషియా గోధుమపంటలను, చమురు గనులను, అడవి సంపదను హిట్లరు బడయగలడు. ఇది అతని ముఖ్యోద్దేశం.

### అనుకున్నట్లు అవుతుందా ?

కాని దీనికెన్నో ప్రతిబంధకాలు. ఆక్రమిత రాజ్యాలలో జర్మనీ ఎన్నో చిక్కులు పడుతున్నది. రషియాను గెలిచినచో అవి హెచ్చవగును. ఆ దేశాలను అణచియుంచుటకు విశేష సైన్యం నిలువ యుండవలెను. యుద్ధం జరుగుతున్నంతకాలం ఆ దేశాలలో శాంతియుండదు. రషియా రక్షణఏర్పాటులులేని దేశం కాదు. శిక్షణపొందినవారు పొందనివారుగల జనసంఖ్య రషియాదే అన్ని దేశాలకన్న అధికం. ఆయుధ సంపత్తి లేకపోలేదు. వాటి మరమ్మత్తు అవకాశాలు తక్కువకావచ్చు. స్వదేశం రక్షించుటయందు రషియను సైనికుడు వెన్నుచూపని బంటు. జర్మను టాంకులంత ఆధునికమైనవి కాకున్నా రషియాకు టాంకులు, విమానాలు విశేషంగా ఉన్నాయి. సైనిక విధానం కట్టుదిట్టాలుగూడ జర్మనీ అంత సమర్థతకలవి కాకపోయినా చాలఘట్టివి. రషియా నౌకాదళం శక్తిగూడ మెచ్చదగినదే. జలాంతర్గాముల శక్తి తక్కువకాదు.

### ఇతర దేశాల కర్తవ్యం.

ఈ క్లిష్టసమయమునందు అక్షరాజ్యాలలో చేరని యితర దేశాల చర్యపై విజయం చాలవరకు ఆధారపడియున్నది. ప్రజాప్రభుత్వ రాజ్యాలకును, నాగరిక ప్రపంచమంతకు ముప్పు రానున్నది. అమెరికాలో కొద్దిమంది ఒంటరిగాళ్లు తప్ప, తక్కినవారంతా రషియాకు అనుకూలంగా ఉన్నారు. హిట్లరు అందరిపై అధికారిగా, సర్వశక్తిపరుడుగా కాకుండా చేయుటకు ఎంత త్యాగమయినా చేయాలి, ఎంత ఖర్చయినా చేయాలి. ఒకసారి ఆ సర్వాధిపత్యం లభిస్తే అటనుండి అతన్ని మరల్చడం కష్టం. అక్షరాజ్యేతర ప్రపంచమంతా యీ ప్రమాదాన్ని గుర్తించింది. ఇంక వారంతా కలసి తొందరగా సమిష్టి కృషిచేయుటే మిగిలియున్నది.

---

# అధ్యక్ష రూజువెల్టుగారి గంభీర వాక్యములు

## స్వాతంత్ర్య రక్షణ మార్గము సూచించుట.

## ఇంగ్లాండుకి తోడ్పడుటకు అమెరికా నాయకుల హెచ్చరిక.

అమెరికా సంయుక్తరాష్ట్రములు ఇంగ్లాండునకు తోడ్పడుచు ఆయుధసహాయం చేయదలచుట జర్మనీకి చాల కంటకంగా ఉంది. ఇపుడు రషియాపై జర్మనీ యుద్ధం చేస్తున్న పిమ్మట, కమ్యూనిస్టు రషియాకు ధనాధిక ప్రాబల్యగల అమెరికా తోడ్పడునా యని పలువురకు సందేహం కలిగింది. దీనికి తోడుగ యీ నెల మొదలు తేదీన అధ్యక్షుడు రూజువెల్టుగారు "ప్రతివారు పాపంనుండి తొలగిపోదలచినట్లు యుద్ధంనుండి తొలగిపోవాలని చూస్తారు. అమెరికాగూడ యుద్ధంలో దిగరాదనే ఆశిస్తున్నాను" అని అన్నారు. అందుచే అమెరికా యుద్ధంలో చేరదనే అనుమానానికి అవకాశమేర్పడింది. కాని అమెరికా స్వాతంత్ర్య వార్షికోత్సవంనాడు 5 వ తేదీన రూజువెల్టుగారు స్వాతంత్ర్య రక్షణ గూర్చి గంభీరంగా పల్కుచు యిట్లు తెలిపిరి:—"ప్రపంచంలో యితర దేశాల స్వాతంత్ర్యమును హరించుచున్న శక్తి మనదేశాన్ని వదలిపెట్టునని తలచుటకన్న వెర్రితనముండదు. ఈ శక్తి జగన్నాథరథంవలె అన్ని దేశాలవారిని తన చక్రంక్రింద నలిపివేయుచుముందుకు పోవుచుండగ, తానొదిగియున్న తనకేభయంలేదనుకున్న ప్రతిదేశం మోసపోయెను. సామ్రాజ్య కాంక్షతో విజృంభించుచున్న శత్రువును ఇతర దేశాలన్ని ఐకమత్యంతో ప్రతిఘటించకపోవడంవల్ల ప్రతిదేశాన్ని ఒంటరిగచేసి శత్రువు కబళించుచున్నాడు. ఇరుగుపొరుగు దేశములన్నియు స్వాతంత్ర్యము గోల్పోయినచో మన స్వాతంత్ర్యము నిలబెట్టుకోడం దుర్ఘటమగును. అమెరికనులు ఐకమత్యంతో నుండుటయేగాక, చురుకుతనం సమర్థత, కష్టసహనం చూపవలెను. వెనుకనుండి నిరుత్సాహపరచకూడదు, ద్రోహం చేయ

రాదు. మన దేశానికి, మన పతాకానికి, మన చేతనైన పని స్థిరసంకల్పము అవసరమయితే ప్రాణాలు అంకితం చేయాలి" అని అమెరికా ప్రజలను అధ్యక్షుడు హెచ్చరించెను. అమెరికాలో అధ్యక్షపదవికి పోటీచేసిన వెండలు విల్కీగారుగూడ, "మన స్వాతంత్ర్యం నిలబెట్టుకోడానికి ఇంగ్లాండును రక్షించడం అవసరం. ఆలోచనలో కాలం వృథా చేయరాదు త్వరగ నిర్ణయించాలి. ఇంగ్లాండుకి సరకుపోవుటకు తగు కట్టుదిట్టాలను అమెరికా నౌకాదళంవారు చేయాలి. ఎంత త్యాగానికైనా తెగించి బ్రిటిషు సైనికుల ప్రాణాలు కాపాడాలని అమెరికాలో అత్యధిక సంఖ్యాకులు కోరుచున్నారు" అని చెప్పిరి. అంతకు ముందే అమెరికా నౌకాదళ శాఖాధికారి కర్నలు నాక్సుగారు అట్లాంటికు మహాసముద్రంనుండి జర్మను నౌకలను, తరిమివేయాలని ప్రపంచాన్నంత యుద్ధంలో దించుతున్న హిట్లరు శక్తి అణచడానికి ఘట్టిదెబ్బతీసి, నాగరిక ప్రపంచాన్ని రక్షించడానికి అమెరికా చర్య దీసికొనుటకిదియే సమయమని, వివిధ రాష్ట్రాల గవర్నరుల సభలో తెలిపియుండిరి. జర్మనీకి ప్రతికూలంగా ఇంగ్లాండుకి తోడ్పడాలను అభిప్రాయం అమెరికాలో నానాటికి ప్రబలమగుతున్నది. అమెరికా త్వరగ నిర్ణయించకపోయినచో అవకాశం మించిపోయి అక్షరాజ్యాల కనుకూలమగునని బాధ్యతగల అమెరికనులు భావించుచున్నారు. అట్లాంటికు సముద్రం ఉత్తరభాగాన్న ఉన్న ఐసులండు దీవిలో అమెరికా సేనలు దిగినాయి. అధ్యక్షుడు మాత్రం యింకా యుద్ధరంగంలోనికి సైన్యాలను పంపడానికిగాని, సామాను నౌకలకు యుద్ధ నౌకలను కాపలా యిచ్చుటకుగాని నిర్ణయించలేదు. అమెరికాలో యుద్ధం వలదనేవారు లిండుబర్గు మున్నగువారు కొద్దిమంది గలరు. వారి ఆటంకంగూడ తొలగి, ప్రజాభిప్రాయం బాగా దృఢపడుటకే అధ్యక్షులు వేచియున్నాడనుకోవచ్చు. సైన్యాలు విదేశాలకు పోవచ్చను నిర్ణయం అమెరికా శాసనసభయగు కాంగ్రెసులో ఆమోదింపబడగానే, అమెరికానుండి సకలవిధములగు సహాయం ప్రవాహంవలె వచ్చిపడి, జర్మనీని ఇంగ్లాండు అణచివేయుటకు బాగా తోడ్పడగలదు.

### ఈడెనుగారి ప్రకటన.

బ్రిటిషు విదేశాంగమంత్రియగు అంతొని ఈడెనుగారుగూడ యీ వారం ఒక ముఖ్య ప్రకటన చేసేరు. "హిట్లరుతో ఏ విషయమందు ఎప్పుడూ సంధి రాయబారాలు జరుపం. హిట్లరు, ఆతని సిద్ధాంతములు సర్వనాశనం అగువరకు యుద్ధం కొనసాగింతుము. ఈ ప్రపంచంలో హిట్లరు జీవిత పద్ధతికి, మన జీవితపద్ధతికి రెంటికి తావులేదు" నూతన వ్యవస్థగూర్చి తెల్పుచు యిట్లన్నారు: "మనకు రెండు పనులు గలవు. యుద్ధంలో జయించుటొకటి, అందరికి సంతృప్తికరమగు శాంతి యేర్పరచుటొకటి. మనం స్వలాభంకొరకు చూచుటలేదు. బహుమతి మన కవసరం లేదు. మనకు ఒక్క ఉద్దేశంమాత్రమే గలదు:—రాక్షసుడగు హిట్లరు అధికారమును నాశనంచేసి వివిధ దేశములు హాయిగ నివసించుచు, యిప్పటికంటె సుఖంగా శాంతివంతంగా నుండునట్టి ప్రపంచవ్యవస్థ యేర్పరచుటే మా ముఖ్యాశయము. మా జీవితములను యిందుకే అంకితంచేసితిమి. ధైర్యం విశ్వాసమున్నచో మన ప్రయత్నము తప్పక నెరవేరును."

---

# భారతీయ సైనికుల ప్రతిభ.

## ఇరిట్రియా యుద్ధంలో పంజాబు రెజిమెంటుచేసిన ఘన కార్యములు.

ఇటలీవారి తూర్పు ఆఫ్రికాపై బ్రిటిషు సైన్యములు దాడి సలిపినపుడు, అందున్న 2 వ పంజాబు రెజిమెంటు సైనికుల ధైర్యసాహసములను తెలుపు చర్యలు యీ దిగువ వర్ణింపబడినవి. వారిలో పలువురికి బిరుదులు, పతకములు ఒసంగబడెను.

మార్చి 15 వ తేది రాత్రి 2 వ పంజాబు రెజిమెంటు సైనికులు ఇతర దళములతోగూడ డొలలగ్రోడకు పర్వతంపైనున్న కోటను వశపరచుకున్న పిదప జిబనుకొండ దిగువ వేరొక కోటను పట్టుకొనుటకు ముందుకుపోయిరి. కాని సైనికులకు నీరు ఆహారము మందుగుండు అన్నీకూడ కొండకనుమలగుండా చేతులతో మోసుకపోయి అందించవలసియుండెను. సప్లైలు అందక వెనుకకు తగ్గిరి. శత్రువులు మన కోటపై మూడుసారులు దాడివచ్చిరి. అయినా వారి నెంతో నష్టపరచి మన సైనికులు తరిమివేసిరి. ఒక వారంవరకు అల్లే లొంగకుండ శత్రువులు రాత్రింబవళ్లు దాడిచేయుచున్నను, తరిమివేసి కోటను వదలకుండిరి.

మార్చి 25 వ తేదిన 2 వ పంజాబు రెజిమెంటువారు కరెను నగర ముట్టడికి ముందుగబోయి శత్రువులను తరుముచు వెనుకనుండి టాంకులు వచ్చుటకు వీలుకలుగజేసిరి. ఇరు వైపులనుండి శత్రువులు గుండ్లు ప్రేల్చుచున్నను త్రోసుకొనిపోయి పంజాబీలు కెరెను ముఖద్వారంవలెనున్న చంచిలు కొండ నాక్రమించిరి. జనవరిలో బరంటు ఆక్రమించినపుడు, నవంబరులో కసాలా నగరం పట్టుకొన్నపుడు పంజాబు రెజిమెంటే యెక్కువ పాటుబడెను.

జమదారు అమరుశింగు (మిర్పురు జిల్లా) కరేను ముట్టడియందు తన సైనిక దళంతో ముందుపోయి శత్రువుల మరఫిరంగి శిబిరాన్ని వశపరచుకొనెను. ఒకసారి శత్రువులచే తరిమివేయబడినను, రెండవసారి పోయి పట్టుదలతో రాత్రంతా యుద్ధంచేసి వశపరచుకొనెను. అతనికి ఐ.ఓ.ఎం. (ఇండియను ఆర్డరు ఆఫ్ మెరిటు) బిరుదొసంగబడెను.

ఐ.డి.ఎస్.ఎం. (ఇండియను డిస్టింగ్విష్డు సర్విసు మెడలు) పతకము నాయకు అజీబు ఖానుగారికిని, నాయకు హర్బాను శింగుగారికిని నొసంగబడెను. ఖానుగారు షాపూరు జిల్లా నివాసి. ఇతడు జిబనువద్ద శత్రువుల మరఫిరంగిని స్వాధీనం చేసుకొనెను. హర్బాను శింగు తన దళముయొక్క హవల్దారు చంపబడ్డ, తమ కేంద్రస్థానమునకు సందేశం తెలుపు తీగల సాధనం తెగిపోయినప్పుడు, శత్రువుల గుండ్లకు గురియగుతునే రాత్రంతా ఆ తంతిమార్గము సరిచేయుచుండెను. ఇతడు రావల్పిండి జిల్లావాడు. సిపాయి ఖాను జాహా గారు (అటకు జిల్లా) తమ దళం వెనుకకు మరలుచున్నపుడు గాయపడిన తోడి సిపాయిని మోసుకొని శత్రువులగుండ్లను తప్పించుకొనివచ్చి, రక్షించెను. వెంటనే వేరొకని తెచ్చుటకు వెళ్లెను. ఇతనికిగూడ ఐ.డి.ఎస్.ఎం. పతకము యిచ్చిరి.

# మధ్యప్రాచ్యమునందలి రక్షణ యేర్పాటులు.

## చాలసంతృప్తికరముగనున్నవి.

## వావెలు సేనానివీడ్కోలు ప్రకటన.

మధ్యప్రాచ్యదేశమునందు బ్రిటిషు సర్వ సేనాధికారిగ నుండి ఆఫ్రికాయుద్ధం విజయవంతంగా ముగించిన వావెలు సేనాని యిపుడు ఇండియా సేనాధిపతిగ నియమింపబడెను. ఇండియాలో సేనాధిపతిగనున్న సర్ క్లాడు అచినులేకుగారు మధ్య ప్రాచ్యసేనానిగ వెడలిరి. సర్ ఆర్చిబాల్డు వావెలు గారు ఈజిప్టు ప్రాంతములు వీడుచున్నపుడు, పత్రికా విలేఖరులకు అచటి పరిస్థితులు చాల సంతృప్తికరంగానున్నవని చెల్పుచు, క్లుప్తంగా యుద్ధసమీక్ష నీవిధంగా తెలిపిరి :—

“ ఒకప్పుడు ఉచ్ఛదశయందుంటిమి. ఒకప్పుడు తక్కువ దశయందుంటిమి. ఒకప్పుడు గొప్ప విజయములు పొందేము. ఒకప్పుడు బాగాఓడిపోయేం. యుద్ధ సామగ్రి తక్కువగనుండెను. తగినంత ఉందని ఎప్పుడు తృప్తిచెందలేదు. సైనికులు మంచి సేవచేసిరి. ఇచటి సైనికులు చేసినంత బాగా సర్వీసు యింకెవ్వరు చేయలేరు.

అబిసీనియా యుద్ధం చాలవరకు ముగిసినట్టే. డెబ్రాటబోరు మనకు లొంగిపోయినది. నైరుతి భాగమున కొద్ది స్థలం గోచిపాతవంటిది మిగిలియున్నది. అదీ త్వరలో లొంగిపోగలదు. ఈ ప్రాంతంలో మొదట 2 లక్షల ఇటలీ సేనయుండెను. అంత గొప్ప సైన్యమును జనరలు కన్నింగుహాం ప్లాటుగార్లు లొంగదీసుకొనివచ్చిరి.

సిరియాలో స్థితి అబిసీనియాయంత సులభంగాలేదు. అచటి దేశం చదునైనదగుటచే శత్రువుల ప్రతిఘటన తీవ్రంగాఉంది. పామైరా నగరం, డెయిర్ ఎస్ జోరు పురముగూడ మనకు లొంగిపోయినవి. స్వతంత్ర ఫ్రెంచి సేనలు తీవ్రంగా ధైర్యంగా పోరుచున్నవి. త్వరలో విషీ ప్రతిఘటన తొలగిపోవును. (సిరియాలో యుద్ధం ముగిసి సంధిషరతులగూర్చి ఉభయపక్షములవారు ఆలోచించుచున్నారని యీ వారం వార్తవచ్చెను.)

పడమటి ఎడారి.—ఇచట శత్రుసేనలు మనతో యిదివరకు ఢీకొన్నప్పటినుండి ముందుకురాలేదు. మన సైన్యాలు వెనుకకు రావలసివచ్చినను, కొన్ని టాంకులను మనం నష్టపోయినను, వారినుండి మనకు లభించిన టాంకులుకూడ చాల ఘట్టివే. పశ్చిమ ఎడారియందలి సేనానాయకుడు యిపుడే నాకగుపడి అచటి పరిస్థితులు చాల సంతృప్తికరంగా ఉన్నాయని చెప్పెను. కనుక కొద్దిగ ఆదుర్దాయున్నను, మధ్య ప్రాచ్యరక్షణ శ్రేణులు సంతృప్తికరముగా ఉన్నాయనడానికి ఎట్టి సందేహంలేదు.”

రష్యాయుద్ధంవలన మధ్యప్రాచ్య యుద్ధపరిస్థితు లేమయినా మారునా అని అడుగగ వావెలు సేనాని యిట్లు చెప్పెను : “ రష్యాయుద్ధంవలన మన సేనలకు కొంత విశ్రాంతి కలిగింది. జర్మనులు మధ్యప్రాచ్యముపైనే తమదృష్టి మరల్చియుండినచో మనకు చాలకష్టమయ్యేడిది. క్రీటు దీవిని వశపరచుకున్నపుడు వారికి మనం తీవ్ర నిరోధం కలిగించేము. అట్లుగాక సులభంగా వారు క్రీటును వశపరచుకొనియున్నచో వెంటనే సిరియా ఇరాకులమీదికి తమ విమాన దళములను పంపి తిరుగుబాటుదారుకు సహాయం చేసియుందురు. ఇపుడు జర్మనులు రషియాపై పడుటచే, సిరియాను పూర్తిగ ఆక్రమించి మనరక్షణ దిట్టపరచుకొనుటకు మనకు అవకాశం కలిగింది. మన సైన్యాలకు కొంతవిశ్రాంతి, తరబీదు కలిగింది. రష్యా—జర్మనుయుద్ధం ఎట్లుముగుస్తుందో యిపుడు చెప్పడం కష్టం. జర్మనులు కాకసను ప్రాంతమువరకుపోయి గెలిచిన పిదపగూడ, యింకా రష్యాలో ముందుకు పోవుదురా లేక తిరిగి మధ్య ప్రాచ్యమున దాడి సాగింతురాయను విషయం చెప్పజాలం. జర్మనుల ఉద్దేశములు కనుగొనట బహుకష్టమవుతున్నది. నిరోధించుటకు రష్యా శక్తిగూడ ఎంతగలదో చెప్పుట కష్టం. రష్యాకు సైన్య సంఖ్యాబలం ఎక్కువ. విశాలప్రదేశం. ఒకచోట ఓడిపోయిన మరోచోటికి దూరంగాపోయి అచట యుద్ధం సాగించగలరు. ఈ రెండు విషయాలలో రష్యాబలం అధికంగానే ఉంది. కనుక పర్యవసానం ఊహింపజాలము ” అని సర్ ఆర్చిబాల్డు వావెలు సేనాని తెలిపెను.

# క్రొత్త సేనాని సర్ అచినులేకుగారి ప్రకటన.

మధ్యప్రాచ్యదేశమున క్రొత్త సేనానియగు సర్ క్లాడు అచినులేకుగారు కైరోనగరం చేరగానే ముఖ్యమగు ప్రకటన గావించిరి. అమెరికా సైన్య సహాయం 12, 14 లేక 24 నెలలలో రావలసిన అవసరం గలదు. జర్మనులు రషియాలో కాకసను వరకు పోయి, అటనుండి బాకు చమురుగనులవరకు ప్రాకెదరు. అందువలన ఇండియాలోను, మధ్యప్రాచ్య దేశములందును విశేషంగా మన సైన్యాలను కాపుదలగనుంచేటట్లు చేయుదురు. తన యిష్టప్రకారం చేయ టర్కీనిగూడ జర్మనీ ఒత్తిడిచేయవచ్చును. జర్మనులు బాల్కను రాజ్యములమీదికి దూకుటకు మధ్యప్రాచ్య దేశము నొక మెట్టుగా ఉపయోగించియుండిరి. బాల్కను ప్రజలు ఎల్లకాలం యిపుడున్నట్లు జర్మనుల ఒత్తిడికి లొంగియుండరు. కనుక యిపుడు మళ్లా బాల్కనులమీదికి దూకుటకు మన కట్టి అవకాశము రావచ్చునని అచినులేకుగారు తెలిపిరి.

సర్ అచినులేకు సర్ వావెలుగార్ల స్థలములు మార్పుటలోగల ప్రాముఖ్యతగూర్చి విచారింతము. ఇండియా రక్షణకు ఎక్కువ యోచనాశక్తి కావలసియున్నది. జనరలు వావెలుగారు ప్రపంచమంతటి పొగడ్తను కృతజ్ఞతను బడసెను; అనేక బాధ్యతలను, కష్టకార్యములను అనేకచోట్ల నిర్వహించిరి. అతని అనుభవం, సమర్థతలవలన ఇండియా మంచి లాభం పొందగలదు. రషియాభాష వారికి బాగా తెలును, రషియావారితో యుద్ధంచేయు అనుభవంగలదు. జనరలు అచినులేకుగారు ఇండియాయెడల సానుభూతిగలవారనియు, సైనిక కట్టుదిట్టాలు చేయుటయందు సమర్థులనియు పేరుపడిరి. యుద్ధరంగంలోకే యిపుడు వారు వెళ్లినందున మంచి విజయం బడయగలరని ఆశింపవచ్చును.

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డెరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.